TELUGU GAZALS
By Dr C Narayana Reddy

First Edition : 1986

Price Rs 20

For Copies
CHETANA
Literary & Cultural Association
Guntur

ANDHRA PRADESH BOOK DISTRIBUTORS
Kingsway, Secunderabad

*Printed at*
MASTER ART PRINTERS
1-1-694/2/A. Gandhinagar,
HYDERABAD 500 380

# తెలుగు గజల్స్

డా. సి. నారాయణరెడ్డి

చేతన
సాహితీ సాంస్కృతిక సంస్థ
గుంటూరు

# ఈ సంపుటి గురించి

ఉర్దూభాషలో గజల్ ఒక కమనీయ కవితాలహరి.

ఒక గులాబీల గుచ్ఛం.

ఒక మత్తకోకిల రసార్త్రకూజితం.

సరసభావన, చమత్కార ఖేలన, ఇంపూ, కుదింపూ గజల్ జీవ గుణాలు.

అది జోల పాడుతుంది - జ్వాల రేపుతుంది.

గజల్‌లో ఒకే విషయాన్ని చెప్పాలన్న నిర్బంధం లేదు.

భావం ఏ చరణానికి ఆ చరణం విడిగా ఉండొచ్చు.

గజల్ పల్లవిని 'మత్లా' అంటారు. చివరి చరణాన్ని 'మక్తా' అంటారు.

పల్లవి చివర ఉన్న పదం, ప్రతి చరణం చివర అంత్యప్రాసను రూపొందిస్తుంది.

కొన్నిట్లో అంత్యప్రాసకు ముందు మరో ప్రాసపదం ఉంటుంది. వీటిని రదీఫ్ ఖాఫియా లంటారు.

చివరి చరణంలో కవి నామ ముద్ర ఉంటుంది. దీనిని 'తఖల్లుస్' అంటారు.

నా 'తఖల్లుస్' 'సినారె'.

గజలంటే అనేకార్థాలున్నా స్థూలంగా "ప్రియురాలితో సల్లాపం". ప్రాయికంగా ఇది శృంగారపరం. కొన్నిటిలో తాత్త్విక స్పర్శలూ ఉంటాయి. కానీ నా గజళ్లలో ప్రణయానికి బదులుగా మానవీయ దృక్పథాన్నీ, ప్రగతి శీలాన్నీ, మెత్తని అధిక్షేపాన్నీ ప్రవేశపెట్టాను.

పదం నాదంగా, భావం రాగంగా, అనుభూతి స్వరరీతిగా గుండెతో నేను పలికించినవి ఈ గజళ్లు.

ఈ సంపుటిలోని ఆరుగజళ్లను (పరులకోసం, ఏవో ఏవో బాధలు, నా హృదయం చలించిపోగానే, ఆత్మలను పలికించేదే, ఎంతచీకటి, మరణం నను వరించి వస్తే) సంగీత దర్శకులు యస్ రాజేశ్వరరావు గారి సారథ్యంలో నేను స్వయంగా గానం చేయగా ప్రముఖ సాంస్కృతికసంస్థ 'రసమయి' యం. కె. రాము సాచివ్యంలో క్యాసెట్లుగా రూపొందించింది. సంగీతంతో కొంత కొంత పరిచయమే వున్న నేను పాడిన గజళ్లకు అంతంత వ్యాప్తి కలిగినందుకు ఆశ్చర్యంతోనూ, ఆనందంతోనూ పులకించిపోతుంటాను. అందుకు కవితాగాన రసికులకు నా అభినందనలు

లోగడ 'ఆంధ్రజ్యోతి' వార పత్రికలో వరుసగా వెలువడిన ఈ గజళ్లను పుస్తకరూపంలో ప్రచురించిన 'చేతన' సాహితీ సాంస్కృతిక సంస్థ (గుంటూరు) సారధి, ఆత్మీయ సోదరుడు అన్నపురెడ్డి విజయ భాస్కరరెడ్డికీ, చిరంజీవులు అన్నపురెడ్డి నాగార్జునరెడ్డికీ, అన్నపురెడ్డి జగన్మోహనరెడ్డికీ నా అభినందనలు.

16.11.86
హైదరాబాదు

# వి ష య సూ చి క

పరులకోసం పాటుపడని నరుని బ్రతుకు దేనికని ?
మూగనేలకు నీరందివ్వని వాగుపరుగు దేనికని ?

తాతలు తాగిన నేతుల సంగతి నీతులుగా పలికెను మన సంస్కృతి
జల్లుకు నిలవని ఎండకు ఆగని చిల్లుల గొడుగు దేనికని ?

ఆదర్శాలకు నోళ్లు చాలవు ఆశయాలకు ఫైళ్లు చాలవు
పదపదమంటూ పలుకులెగానీ కదలని అడుగు దేనికని ?

జలవిద్యుత్తుకు కరువే లేదు జనసంపత్తికి కొరవే లేదు
అవసరానికి మీట నొక్కితే అందని వెలుగు దేనికని ?

శిశుహృదయానికి కల్లలు లేవు రసరాజ్యానికి ఎల్లలు లేవు
లోపలి నలుపు 'సినారె'కు తెలుసు పైపై తొడుగు దేనికని ?

ఏవో ఏవో బాధలు భరించె మూగజీవితం
ఎన్నో ఎన్నో గీతలు ధరించె తెల్లకాగితం.

సుతకోటి హితకోటి వున్నా గతవైభవం చాటుతున్నా
ఎంతో ఎంతో వేదన సహించె మాతృభారతం.

చిరునవ్వు జలతారులున్నా సరదాల రహదారులున్నా;
ఔనా ఔనా ! లోకమే అనంత శోకపూరితం

పొరలేని తత్వార్థమున్నా భువిలోని వృత్తాంతమైనా
ఐనా ఐనా కావ్యమే అనూన కల్పనామృతం.

ఇది వాపు—అనుకోకు బలుపు; ఇది ఊపు—రాలేదు మలుపు
అంతే అంతే సంఘమే అనాది వ్యాధి పీడితం.

తన గొంతు తడి ఆరుతున్నా మునుముందు ఏ కొండలున్నా
ఏరై పారే జాతికే 'సినారె' గీతి అంకితం.

ఆత్మలను పలికించేదే అసలైన భాష
ఆ విలువ కరువైపోతే అది కంఠశోష

వేదం ఖురాను బైబిల్ వీధిలోన పదతాయా
మతమేదైనా ఒకటేలే ప్రతిమనిషి శ్వాస

అవినీతికి పట్టం కట్టే అభ్యుదయం పూడ్చిన జాతి!
ఇకనైనా కళ్లు నులుముకో ఇది రక్తఘోష.

నానాటికి ఏమీ పతనం నాలో ఒక తీరని మథనం
ప్రభుత్వాలు ఏమైతేమి పైసాపై ధ్యాస.

తల నెరిసిపోతే దిగులు తనువూరిపోతే దిగులు
అది దిగులు కాదు 'సినారే' తుది జీవితాశ.

ఇందరు మనుషులు దేవతలైతే ఎందుకు వేరే కోవెలలు ?
ఇన్ని మనసులూ గీతికలైతే ఎందుకు వేరే కోయిలలు ?

దూసినకొలదీ దోసిలి చాలదు; పరచినకొలదీ పానుపు చాలదు
ఇన్ని మమతలూ ఘుమఘుమ లాడగ ఎందుకు వేరే మల్లియలు ?

దయ కురిపించే తలపే తీయన; లయ పలికించే చూపే తీయన
ఇన్ని మధురిమలు ఎదలో నిండగ ఎందుకు వేరే తేనియలు ?

పగలూ రేయీ రెప్పవాల్చక పక్షపాతమూ అసలే ఎరుగక
ఇన్ని కనులు నా యింట వెలుగగా ఎందుకు వేరే వెన్నెలలు ?

అలిసినవేళ చలువజోలలై తలచినవేళ రాగమాలలై
ఇన్నిగాలులు 'సినారె'ను ఊపగ ఎందుకు వేరే ఊయలలు.

పలుకున్న కావ్యం అనంతం అనంతం
ప్రతిసారి నవ్యం వసంతం వసంతం.

కాలాని కెదురీది కదలాడుతుంటే
కన్నీటి పయనం సుఖాంతం సుఖాంతం.

ఎదలోన విశ్వాన్ని పొదిగించుకుంటే
గదిలోకి రాదా దిగంతం దిగంతం.

చిరునవ్వుతో లేమి ఛేదించగలిగే
నిరుపేద హృదయం ప్రశాంతం ప్రశాంతం.

గతకాల మృతభావ కథలెన్నినాళ్లు
కానీ అవశ్యం యుగాంతం యుగాంతం.

అనురాగమే జీవమైతే 'సినారే'
పెనుశైలమైనా లతాంతం లతాంతం.

అమ్మ ఒక వైపు-దేవతలంతా ఒక వైపు
సరితూచమంటే నేను ఒరిగేను అమ్మవైపు.

ఈ బండి చూడరా నాన్నా ఈ గుర్రమింక నీదన్నా
తెగమంకుతో చిననాడు దిగలేదు అమ్మమూపు.

రొదలలో మౌనపాఠంలా వ్యధలలో జ్ఞానపీఠంలా
నా బాల్యమంతా తానే నడిపింది అమ్మచూపు.

చీకటికి చంద్రబింబంలా ఆకలికి పూర్ణకుంభంలా
నిలువెల్ల మమతల వెల్లుగై నిలిచింది అమ్మరూపు.

మెరిసే ప్రభాతకిరణంలా విరిసే వసంతకుసుమంలా
పెరిగే 'సినారె' బ్రతుకులో దొరికింది అమ్మప్రాపు.

## 9

గులాబీపువ్వు చూడగనే బలేగా మురిసిపోబోకు
కనపడని ముళ్ళు ఎన్నెన్నో - ఓ మనసా ! మరిచిపోబోకు.

మహలులో కాపురాలున్నా మజాగా తిండి తింటున్నా
కునుకు కరువైన బ్రతుకులను - ఓ మనసా మరిచిపోబోకు.

వలచిచూస్తే వసంతాలు అలిగిచూస్తే అగాధాలు
కనులకెంతెంత పదునుందో - ఓ మనసా ! మరిచిపోబోకు.

చెట్టు పూచిందా ఉల్లాసం చేను పండిందా సంతోషం
మట్టిలో ఎంత విలువుందో - ఓ మనసా! మరిచిపోబోకు.

నింగిలో తాను కొలువుంది నేలపై జాలిపడుతుంది
మబ్బుకెంతెంత మనసుందో - ఓ మనసా ! మరిచిపోబోకు.

పగటి కలలుంది ఏంలాభం ? ప్రగతికే ఎంత అవరోధం.
క్షణం చేజారితే అంతే - ఓ మనసా! మరిచిపోబోకు.

మంచుపలపైన నీవుంది పొంచి ఒకలోయ చూస్తుంది.
'సినారె' మాట లోతెంతో - ఓ మనసా ! మరిచిపోబోకు.

# 10

గదిలో మూల్గుతున్నావా విశాలగగనమా
రొదలో నలుగుతున్నావా రసైకహృదయమా !

కుళ్లిన బురదనీట వేళ్లను సారించుకొనీ
అల్లన ఎదుగుతున్నావా ప్రఫుల్లకమలమా !

పండిన వెన్నెలనూ ప్రకృతికి అర్పించుకొనీ
పాపం తరుగుతున్నావా ప్రపూర్ణచంద్రమా !

కలతల చీకటులను కళ్లలో కుదించుకొనీ
కలకల వెలుగుతున్నావా ప్రసన్నవదనమా !

పచ్చని ఆశయాల పగుళ్లు లెక్కించుకొనీ
బతుకును అడుగుతున్నావా ప్రశాంతమరణమా !

వాలే ఆకుల నిశ్వాసలు పూరించుకొనీ
లోలో పెరుగుతున్నావా వసంతపవనమా !

మండిన ఈ 'సినారె' గుండెను అంటించుకొనీ
మంచై కరుగుతున్నావా మనోజ్ఞకవనమా !

# 11



విసుగొచ్చిందా జనమంటే వెర్రివాడా !
ఆ జనమే నిను నడిపించే అడుగుజాడ.

కునుకొచ్చిందా చదువంటే కుర్రవాడా !
చదువేరా నిను లాలించే చల్లనినీడ.

దడపుట్టిందా ప్రేమంటే పడుచువాడా !
ప్రేమేరా నిను ఒడిచేర్చే వెన్నెలమేడ.

మోజుడిగిందా బతుకంటే ముసలివాడా !
ఆ బతుకే నిన్నూగించే ఆశల ఊడ.

బెరుకొచ్చిందా చావంటే పిరికివాడా !
ఆ చావే ఓయి 'సినారె' ఆఖరి ఓడ.

వికసించిన కుసుమం నిలిచేదీ ఒక రెన్నాళ్ళంటాను
వెలకందిన ముదిపం వెలిగేదీ  ఒక మూన్నాళ్ళంటాను.

మతిచెదిరే మలుపులు బులిపిస్తున్నా ప్రతి మజిలీలోన
గతి తప్పని బ్రతుకే పయనించేదీ నూరేళ్ళంటాను.

జన్మించిన జీవికి మృతి తప్పదనే సత్యం కాదనను
చరితార్థుల పేరే జీవించేదీ వేలేళ్ళంటాను.

మనసాపని శోకం చీల్చుకువస్తే ఆపకు ఆవేగం
కనుపాపల పొరలను వెలిగించేవీ కన్నీళ్ళంటాను.

జనకోటికి అందక కాగితాలపై సాగుతూంది ప్రగతి
ఆ ప్రగతి 'సినారె' ఎండమావిలో పరవళ్ళంటాను.

# 13

మనసైన స్నేహం మరుమల్లెచెండు
ఎదలేని మోహం అది గాలిదిండు.

నేనున్న నేటిసంఘం పైపైని మేలివర్ణం
ఇక విప్పనేలా ఇది మేడిపండు.

అడుగేస్తె ఏమి అలుపో నడకంటె ఎంత జడుపో
హోరెత్తదేమీ ఆ రామదండు.

ఆశించి చేరుకున్న అమృతాల దీవికన్న
అనుకోక అందే ఆ తీపి మెండు.

మదిలోని మూగగాయం వ్యధరేపితే 'సినారె'
ఏన ముత్యమైనా పెనురాతిగుండు.

మరణం నను వరించివస్తే ఏమంటాను - నేనేమంటాను ?
పాలుపట్టి జోలపాడి పడుకోమంటాను.

లంచం నను భజించివస్తే ఏమంటాను - నేనేమంటాను ?
తిరుమలగిరి హుండీలో చొరబడమంటాను.

కామం నను కలవరపెడితే ఏమంటాను - నేనేమంటాను ?
అలిగివున్న పడుచుజంటతో కలబడమంటాను

క్రోధం నను కవ్విస్తూంటే ఏమంటాను - నేనేమంటాను ?
పసచచ్చిన పేడిజాతిలో బుసలిడమంటాను.

లోభం నను బులిపిస్తుంటే ఏమంటాను -నేనేమంటాను ?
తెగబలికే కవిపలుకుల్లో దిగబడమంటాను.

అహంకార మెదురైవస్తే ఏమంటాను - నేనేమంటాను ?
నరుని వదిలి కొండనెత్తిలో స్థిరపడమంటాను.

కాలం పులిలా గాండ్రిస్తే ఏమంటాను - నేనేమంటాను ?
దిగులెందుకు ఓయి 'సినారే' తెగబడమంటాను.

# 15

సుఖమైనా దుఃఖమైనా ఒకటే నా భావన
సఖుడైనా శత్రువైనా ఒకటే నా దీవన.

బ్రతుకంతా పాడుకుంటా మృతిలోనా నవ్వుకుంటా
వెలుగైనా చీకటైనా ఒకటే నా స్పందన.

ఎగిసిందీ హోరుకడలి ఎదురేగే నావనాది
గెలుపైనా ఓటమైనా ఒకటే నా సాధన.

ఏ శిలలో నాదముందో ఏ ఉలిలో ఊపిరుందో
జడమైనా జీవమైనా ఒకటే నా శోధన.

సెగలాగ కంటినిండే రగిలిందా ఓ 'సినారె'
క్షుధయైనా క్రోధమైనా ఒకటే నా వేదన.

# 16

ఒకే ఒకసారి నా చూపు ఎకాయెకి ఆగిపోయింది
కలవరం చిలికే చలికాలం నిలువునా కాగిపోయింది.

ఏమిటీ వింతచైతన్యం ఎక్కడిది ఇంతసౌజన్యం ?
కొమ్ములను వంచని గిరిశిఖరం కొమ్మలా ఊగిపోయింది.

గొంతులో మూగపొగరుందో గుండెలో తీగచిగురుందో
మోడులా నిలిచిన నామౌనం మురళిలా మోగిపోయింది.

నిరాశల చీడ తగిలిందా నరాలకు వేడి తగిందా ?
కత్తిలా మెరిసే యువరక్తం వత్తిలా తూగిపోయింది.

గోతులా నీతినిలయంలో గోడలా జాతిహృదయంలో ?
'సినారే'లోని శిశుహృదయం చిచ్చులా రేగిపోయింది.

ఇప్పుడిప్పుడే తెలిసిందీ కాటేసే పొదరిళ్లున్నాయనీ
ఇప్పుడిప్పుడే తెలిసిందీ కాల్చేసే వడగళ్లున్నాయనీ.

పలకరించిన ప్రతిచూపూ వెన్నెల చినుకే అనుకున్నాను
ఇప్పుడిప్పుడే తెలిసిందీ విషమెగజిమ్మే కళ్లున్నాయనీ.

బ్రతుకూ నటనా వేరువేరనీ భావించాను ఇన్నాళ్లూ
ఇప్పుడిప్పుడే తెలిసిందీ నటియించే కన్నీళ్లున్నాయనీ.

ఎదురుపడగనే చేతులుకలిపే ఎన్నిసందడులు చూశానో
ఇప్పుడిప్పుడే తెలిసిందీ వంచించే కౌగిళ్లున్నాయనీ.

అడవుల్లోన నడిరేయైనా నడిచాను నే పదిలంగా
ఇప్పుడిప్పుడే తెలిసిందీ జడిపించే వాకిళ్లున్నాయనీ.

కోరిన గమ్యం అందెననీ అనుకున్న 'సినారె'కు చిత్రంగా
ఇప్పుడిప్పుడే తెలిసింది విసిరేసే పరవళ్లున్నాయనీ.

# 18

కనుదారుల ముసిరే చీకటిలో ఒక మిణుగురు పురుగే చాలు.
క్షణమైనా కదలని వేకువలో ఒక గునగున పరుగేచాలు.

చెలరేగే రౌద్రసముద్రంలో శివమెత్తిన పొంగులకేమి
చలచల్లని పాపల పెదవులపై ఒకతెల్లని నురుగేచాలు

పయనించే ఒంటరి పథికునికీ భ్రమకొలిపే దృశ్యాలెన్నో
తియతీయని పిలుపులు రమ్మన్నా వెనుదీయని అడుగేచాలు.

చిగురించిన నందన సీమలలో నివసించే సంపదలున్నా
సెగలేవో రగిలే విరహాలకూ చెలిపయ్యెద గొడుగేచాలు.

మృదుమృదువుగచేసే బోధలతో కథనడవదు ఓయి 'సినారే'
మదమెక్కిన జగతిని అదిలించే పదునెక్కిన నుడుగేచాలు.



సి. నారాయణరెడ్డి

నీటిని లేచే ఆవిరికీ నింగిని మూగే కోరిక
నింగిని పూచే జాబిలికీ నేలను సాగే కోరిక.

శిరసులనూపే చేలున్నా చేతులుకలిపే పూలున్నా
పదమాగని పసిగాలులకూ వెదురున మోగే కోరిక.

పిలుపులు గళమున పుడుతున్నా పెదవులతలుపులు తడుతున్నా
మౌనం వలచిన మమతలకూ మదిలో మూగ్గే కోరిక.

చలువగదులలో తామున్నా చదువూ సుఖమూ తమకున్నా
అలజడి రగిలే గుండెలకూ అడవుల దాగే కోరిక.

పచ్చని ప్రాయంలో వున్నా పయనించే విధి తమదైనా
నిజము 'సినారే' కొందరికీ నిలబడి తూగే కోరిక.

చిరునవ్వును పలికించే స్వరకల్పనలెన్నెన్నో
హృదయాలను ఒలికించే మృదుచిత్రణలెన్నెన్నో

శిలలాగా పడివున్నా తెలవారని బ్రతుకైనా
అగుపించక ఎగిసిపడే ఆ స్పందనలెన్నెన్నో.

ఆ కంఠం ఏదైనా ఆ పాఠం చేదైనా
రసహృదిలో రవళించే శిశుభావన లెన్నెన్నో.

ఏకాంతం ఒడిలోన ఏదో అలజడిలోన
నయనాలు సమర్పించే ప్రియభాషణలెన్నెన్నో.

మునుముందుకు పోలేక క్షణమైన నిలువలేక
కెరటాలై ఘోషించే చిర వేదనలెన్నెన్నో.

ఆ మాటే విషమైనా ఆ మనిషే వెగటైనా
కసి మాటున సాగించే కరచాలనలెన్నెన్నో.

వికసించిన ప్రతి కుసుమం ప్రకటించదు తన హృదయం
అరుదైన 'సినారే'పై ఆరాధనలెన్నెన్నో.

# 21

మబ్బుకు మనసే కరిగితే అది నీరవుతుంది.
మనసుకు మబ్బే ముసిరితే కన్నీరవుతుంది.

వంకలు డొంకలు కలవనీ జడిపించకు నేస్తం!
జంకని అడుగులు కదిలితే అది దారవుతుంది,

ఎడారి దిబ్బలు దున్నితే ఫలమేముందనకు.
ఇసుకల గుండెలు పగిలితే అది పైరవుతుంది.

మనిషీ మృగమూ ఒకటనీ అనుకుంటే వ్యర్థం
మనుషులు పదుగురు కూడితే ఒక ఊరవుతుంది.

ఎంతటి ఎత్తులకెదిగినా ఉంటుంది పరీక్ష.
హిమగిరి శిరసులు మాడితే అది యేరవుతుంది.

బిరుదులు పొందే వ్యాప్తికీ విలువేమి 'సినారే'
చెరగని త్యాగం మిగిలితే ఒక పేరవుతుంది.

## 22

మంచుపొగలుండేవి మరికొన్ని నిమిషాలే
ఆ పిదప నిండేవీ ఆదిత్యకిరణాలే.

ముళ్లు కాటేస్తున్నా జల్లు జడిపిస్తున్నా
కడదాక నడిచేవీ తడబడని చరణాలే.

మనిషి పశువవుతుంటే మతం విషమవుతుంటే
మమతలను పంచేవీ మడిలేని హృదయాలే.

ఎదలలో సెగలున్నా ఎదుట ఏ పొగలున్నా
దయను కురిపించేవీ తడివున్న నయనాలే

కాలమే చీకటిలా కళ్లలో చొరబడినా
ఓ 'సినారె' నీవీ ఉరిలేని ఉదయాలే.

ఎదలోకప్పైతే ఎక్కడవున్నా దూరం కాదంటాను
అలిపిరితీగకు నిలువెల్లపూలున్నా బారం కాదంటాను.

ఎవరి బ్రతుకులో ఎన్నికడలులో ఎంత ఈదినా ఎన్నిమునకలో
మునిగే వేయీ ముట్టినదల్లా తీరం కాదంటాను.

మనసును కలబోసి మనకందించే గరికపువ్వైనా తరగని కానుక
మనసు ముదుచుకుని మణులు కూర్చినా హారం కాదంటాను.

ఇది బహూతీపని ఇది కడుచేదని ఈ రుచివాదం ఎందుకోసమని ?
నచ్చిన హృదయం ఇచ్చిన మిరియం కారం కాదంటాను.

మణులున్నాయి మట్టికడుపులో; మునులున్నారు మూఢజగతిలో
మాయావాదం వేదాంతానికి సారం కాదంటాను.

ధర్మం పగలే దారితప్పగా దమనవిధానం నోరు నొక్కగా
చేయి విసిరితే ఓయి 'సినారే' నేరం కాదంటాను.

మనసుంటే చెవికి తడుతుంది ప్రతిమాట మనోహరమై
పలుకుంటే ఎదను తడుతుంది ప్రతిపాట సుధాకరమై.

బ్రతుకంటే మృత్యుబంధువనీ ప్రతినిత్యం అనుకుంటే
కాడైనా కంటపడుతుంది కణకణమూ శ్రీకరమై.

మతమంటే ఒక అభిమతమనీ ప్రతిమనిషీ అనుకుంటే
జగమంతా రూపుగొంటుంది సహజీవన మందిరమై.

అరపొరలూ త్రుటిని తుడిచేసే ఒక చిరునవ్వు చిలికితే
శిలసైతం పలకరిస్తుంది నవచేతన భాసురమై.

మురిపెంతో చేత అందుకునీ జడముడిని తురుముకుంటే
గరికైనా విరిసిపోతుంది మృదుపరిమళ బంధురమై.

విలువేదీ అసలు తెలివికనీ చింతిలబోకు 'సినారె'
వెలకడితే వెలిగిపోతుంది ప్రతికెంపు ప్రభాకరమై.

ఎవరయ్యా ఎందుకు మీరెందు కురుకుతున్నారు ?
ముళ్లలాగ దిగిపోయిన కాళ్లు పెరుకుతున్నారు.

ఇటు నిరాశ అటు దురాశ ఏది ఏది మీ గమ్యం ?
కదురులేని బ్రతుకుమీద కలలు వడుకుతున్నారు.

సన్నగిల్లెనా ధైర్యం ? సళ్లిపోయెనా శౌర్యం ?
రగిలే వేసవిలో ఇంతగా వణుకుతున్నారు.

ఇరుకునుంచి బయటపడీ వెరపులోంచి కుదుటపడీ
ఈ యెడారి పొదుగనుంచి ఏమి పితుకుతున్నారు ?

నేలమీద నిలువలేక గాలిలోన ఈదలేక
రాలి పడిన ఇంద్రధనువు రంగులతుకుతున్నారు.

ఉప్పెనలా ఉదయించీ నిప్పుల్లో జీవించీ
వెళ్లవాచి 'సినారె' ! గతకీర్తి గతుకుతున్నారు.

మోడు కలవరిస్తున్నది పువ్వై జీవించాలని.
నేడు కలవరిస్తున్నది రేపై జీవించాలని.

మగతనుంచి తప్పుకునీ పొగదాడికి తట్టుకునీ
కన్ను కలవరిస్తున్నది చూపై జీవించాలని.

అంతులేని నీలిమలో గొంతుబంటి దిగిపోయినా
మిన్ను కలవరిస్తున్నది మెరుపై జీవించాలని

పొదవేసిన మౌనశిక్ష కెదలోనే ఎదురుతిరిగి
వెదురు కలవరిస్తున్నది పిలుపై జీవించాలని.

ఎడారిలో ఎన్నాళ్లీ "ఏకతార" లాంటి నడక?
మనసు కలవరిస్తున్నది మలుపై జీవించాలని.

కత్తుల ఒత్తిడిలో రక్కసి తొక్కిడిలో 'సినారె'
కలం కలవరిస్తున్నది గెలుపై జీవించాలని.

# 27

ఎవరేమని తిడుతున్నా ఈ వేషం బాగున్నది
ఎంతగ దిగబడుతున్నా ఈ దేశం బాగున్నది.

కాళ్లరెండు విరిగిపోయి కదలని గతిలో వున్నా
ముందుకు సాగండి అనే సందేశం బాగున్నది.

అదిగో ఆకాశవాణి అందించే తేనెపాట
ఇంకెందుకు దిగులయ్యా ఈ మాసం బాగున్నది.

ఒక్క దండ చాలు గద్దెనెక్కిన మెడ వంచుటకై
ఎవరోఅంటే విన్నా ఈమోసం బాగున్నది.

ఏలిన వారన్నారట ఎక్కువగా తినవద్దని
ఇంత కొంచెమే అయినా ఈ గ్రాసం బాగున్నది

నిన్న నిన్న — రేపు రేపు నేటిపైనె అసలుచూపు
అందిందల్లా స్వాహా అవకాశం బాగున్నది.

ఓయి 'సినారె' ఎందుకు ఉద్వేగం నీకు ? సరే
మంటల్లో చిక్కుకున్న మధుమాసం బాగున్నది.

పిడుగులేవో పడతాయని గడియ గడియకూ ఆగకు
గంటను మెళ్లో కట్టుకు ఒంటరిగా ఊరేగకు.

ఎదుట చూడు ఆకాశం ఎంత ఎగిరితే అంతగ
జాగా కరువైనట్టుగ మూగినచోటే మూగకు

ఏది త్యాగనిరతి ? లోకహితం కొరకు ఆత్మాహుతి
మెప్పులకో గొప్పలకో నిప్పులలో పడిపోగకు

ఎంతదేశభక్తుడివో ఎరుకేలే అందరికీ
జనగణమన పాడుతూంటె అనవసరంగా ఊగకు.

సారా తాగడమేదో నేరమని అననుగాని
తాగేటప్పుడు గుండెను తగలేసి మరీ తాగకు.

అంతటి నాయకుడివైతే గొంతెత్తుము నడివీధిన
విరిగిన వ్యక్తిత్వంతో బురఖామాటున వాగకు.

ఓయి 'సినారే' ఎందుకు ఉపదేశం అంటావా
పిచ్చికి చైతన్యమనే పేరుపెట్టి చెలరేగకు.

ఎటుపోతున్నది దేశం ఎన్నిసార్లు అడగాలి ?
అడుగడుగున అంటుకునే అడుసునెలా కడగాలి ?

ఏది అసలు సరుకో తెలిపిందెప్పుడో అందరికీ
కాకితోకలోన నెమిలి ఈకనెలా తొడగాలి ?

మాటలతో అణగారు సమస్యలు కావివి బాయి !
సిరుగారు కొంగులోన నిప్పునెలా ముడవాలి ?

పగలంతా సూర్యుడిలా ప్రవహిస్తా ఒళ్లు మరచి
శవంలాంటి రాత్రి ఒక్కక్షణం ఎలా గడవాలి ?

చేరుకునే గమ్యానికి గోరీ కట్టిన సంగతి
ఈ వారే చెబుతుంటే ఇంకెందుకు నడవాలి ?

ఈ దేహం కొత్తనెత్తురెక్కనిదే కదలదనే
నిజం తెలిసి ఓ 'సినారె' ! నేనెందుకు జడవాలి ?

జీవిస్తున్నాను మృత్యుశిఖను పూలు ముడవాలని
మరణిస్తున్నాను బ్రతుకుమంటలపై నడవాలని.

పీకపైన గురిపెట్టిన బాకులు బెదిరిస్తున్నా
గర్జిస్తున్నాను ఎత్తుగద్దెలన్నీ జడవాలని.

ఎన్నో కులగిరులు శిరసులెక్కపెట్టి నిల్చున్నా
ప్రవహిస్తున్నాను కాలపరిధులన్నీ గడవాలని.

ఇది విచిత్రవలయం ఇక ఇమడలేను; రెక్కలార్చి
ఎగరేస్తున్నాను నన్ను ఈ లంకెలు విడవాలని.

నిన్న నలుపు మొన్న యెరుపు నేడు పసుపు - రంగు మార్పు
గమనిస్తున్నాను అసలు గ్రంధమేమొ అడగాలని.

ఎంత పేదవడిపోయిన నీ ప్రతిభాకరాంగుళులు
ఊహిస్తున్నాను నుడుల ఉంగరాలు తొడగాలని.

నాకు తెలుసు ఈ మురికి అనాది అనీ ఓ 'సినారె' !
కదిలొస్తున్నాను అగ్నిగంగలతో కడగాలని.



సి. నారాయణరెడ్డి

కంటి ముందు గాలిరంగు కనిపిస్తే కొత్తదనం
వేణువులో వీణగొంతు వినిపిస్తే కొత్తదనం.

వెన్నెల తెలుపును చూస్తూ విసుగు పుట్టుకొస్తుంటే
ఒక రంగుల చందమామ ఉదయిస్తే కొత్తదనం.

పదేపదే ఆ కోకిల పాటేనా ? పిల్లకాకి
గళంలోన ఖవ్వాలీ పలికిస్తే కొత్తదనం.

మాటిమాటికీ నెమిళ్ల ఆటేనా ? కోళ్ల ముద్దు
గుమ్మలతో కూచిపూడి కులికిస్తే కొత్తదనం.

హరిలోరంగహరి అంటూ అడుగడుగున దరువేసే
జియ్యరు విప్లవగీతికి చిందేస్తే కొత్తదనం.

ఈశ్వర్ అల్లా ఒకరని ఎన్నాళ్లని ప్రసంగాలు
ముల్లాలు శివస్తుతులను వల్లిస్తే కొత్తదనం.

గుడి మసీదు ఒకటేనని గొప్పలు చాలును 'సినారె' !
పరమవైదికుడు ఖురాను ప్రవచిస్తే కొత్తదనం.

సి. నారాయణరెడ్డి

నిలబడి చూస్తుంది తెలుగు పలుకలేని కందగా
ఉరమాలిక కంఠమెత్తి గురజాడే గుండెగా.

అడ్డంకుల జడివానల అడుగు కదలలేని తెలుగు
నడవాలిక జంగసావి గిడుగు గొడుగు అందగా.

వచ్చినాడు వచ్చాడూ వచ్చిండూ ఏదైతేం ?
పరిపాలనలోన తెలుగు పెరగాలిక నిండుగా.

ఏమమ్మా తెలుగమ్మా ఎక్కడ నీ చిరునామా ?
గుబాళించిపోని నీ కొప్పుమల్లె మెండుగా.

పలురుచులను మరిగిన మా తెలుగుజాతి ఓ 'సినారె';
పులకించాలింక తెలుగు పలుకే కలకండగా.

# 33

నన్నుదాటి మిన్నుదాటి నామనసా ఎదిగిపో
నడుమ నడుమ విషవాయువు పడగెత్తితె తొలగిపో.

ఇవి హిమగిరి శిఖరాలే - ఏదీ ఆరదు దాహం?
అవసరమైతే జ్వలించి అణువణువుగ కరిగిపో.

కనుగుడ్లను పానిసలుగ అణిచేసే చీకట్లో
క్షణమైనా తిరగబడే మిణుగురులా వెలిగిపో.

ఏంలాభం? ఈవ్యవస్థ ఇంత బండబారిందని
తప్పుకోక నిట్టూర్పుల నిప్పులైన చెరిగిపో.

తెలిసింది 'సినారె'కు నీ నిలయం ఆకాశమనీ
చుక్కల నొదిలేసి చెమటచుక్కల్లో ఒదిగిపో.

# 34

ఏమి చెప్పను నాది ఎంత ఉన్మాదమో?
ఏడ్పులో ఆనవ్వు ఇంకా మిగిలివుంది.

ఎన్ని నిట్టూర్పులో ఎన్ని వడగాడ్పులో
ఇసుకలో ఆపువ్వు ఇంకా మిగిలివుంది.

విషపుచీకట్లు తొక్కిసలాడు నదిరేయి
ఎదురుగా ఆనీడ ఇంకా మిగిలివుంది.

ఏమా జలప్రళయమేమి బీభత్సమది?
ఎదలోన ఆ జాడ ఇంకా మిగిలివుంది.

ఉరిమే తుపాకి సర్వోదయం పలికినా
ఈయింట ఆచిచ్చు ఇంకా మిగిలివుంది.

కార్చిచ్చు తనువెల్ల కాల్చేయగ 'సినారె'!
ఈకంట ఆమంచు ఇంకా మిగిలివుంది.



సి. నారాయణరెడ్డి

గజలంటే మనది కాదనే గజిబిజి నీకెందుకు ?
పరసీమల డిస్కోలంటే ఉరవడి నీకెందుకు?

ఆకాశం గొడుగు అందగా ఆదర్శం ఎదుట ఉండగా
కలకాస్తా చెదిరిందంటే అలజడి నీకెందుకు?

ఇంటిలో అందిన మమత మింటిలో పొందని ఘనత;
అంగాలను వేలంవేసే అంగడి నీకెందుకు ?

పువ్వేమో భాషరానిది పులకరింత యాసలేనిది
అందమెక్కడుందో తెలిసీ సందడి నీకెందుకు ?

ధ్యానమే ఒక అనుభూతి మౌనమే వ్రాయని గీతి.
స్వరహృదయం వింటూ వేరే సవ్వడి నీకెందుకు?

మనసులో శాంతం నిలిపి తనువులో అమృతం నింపి
చూపులతో ఓయి 'సినారే' రాపిడి నీకెందుకు ?

# డా. సి. నారాయణరెడ్డిగారి ప్రచురిత రచనలు

| | |
|---|---|
| 1. నవ్వని పువ్వు (గేయ నాటికలు) | 1953 |
| 2. జలపాతం (పద్యగేయ సంపుటి) | 1953 |
| 3 విశ్వగీతి (దీర్ఘగీతం) | 1954 |
| 4 అజంతాసుందరి (గేయ నాటికలు) | 1954 |
| 5. స్వప్నభంగం (గేయ కావ్యం) | 1954 |
| 6. నారాయణరెడ్డి గేయాలు (కవితా సంపుటి) | 1955 |
| 7 నాగార్జునసాగరం (గేయ కావ్యం) | 1955 |
| 8. వెన్నెలవాడ (గేయ నాటికలు) | 1956 |
| 9. కర్పూర వసంతరాయలు (గేయ కావ్యం) | 1957 |
| 10. రామప్ప (రేడియో రూపకం) | 1959 |
| 11 దివ్వెల మువ్వలు (కవితా సంపుటి) | 1959 |
| 12. విశ్వనాథనాయడు (గేయ కావ్యం) | 1960 |
| 13. సమదర్శనం (గేయ సూక్తులు) | 1960 |
| 14. ఋతుచక్రం (గేయ కావ్యం) | 1964 |
| 15. వ్యాసవాహిని (సాహిత్య వ్యాసాలు) | 1965 |
| 16. అక్షరాల గవాక్షాలు (కవితా సంపుటి) | 1966 |
| 17. జాతిరత్నం (గేయ కావ్యం) | 1967 |
| 18. ఆధునికాంధ్ర కవిత్వము (పరిశోధన గ్రంథం) | 1967 |
| 19. మధ్యతరగతి మందహాసం (వచన కవితా సంపుటి) | 1968 |
| 20. గాంధీయం (గేయసూక్తులు) | 1969 |
| 21. మరోహరివిల్లు (కవితా సంపుటి) | 1969 |

22. మంటలూ-మానవుడూ (వచన కవితా సంపుటి) 1970

23. ముఖాముఖి (వచన కవితా సంపుటి) 1971

24. మనిషి-చిలక (వచన కవితా సంపుటి) 1972

25. ఉదయం నా హృదయం (వచన కవితా సంపుటి) 1973

26. మందారమకరందాలు (వ్యాఖ్యానం) 1973

27 మార్పు నా తీర్పు (కవితా సంపుటి) 1974

28 తేజస్సు నా తపస్సు (కవితా సంపుటి) 1975

29 తరతరాల తెలుగు వెలుగు (నృత్యగేయ రూపకం) 1975

30. ఇంటిపేరు చైతన్యం (కవితా సంపుటి) 1976

31 పగలే వెన్నెల (సినీగీతాల సంకలనం) 1976

32 భూమిక (కావ్యం) 1977

33. మధనం (కావ్యం) 1978

34. నారాయణరెడ్డి నాటికలు 1978

35. ముత్యాలకోకిల (సరోజినీనాయుడు ఆంగ్లకవితలకు అనువాదం) 1979

36. మృత్యువునుంచి (సుదీర్ఘ కవిత. మరికొన్ని కవితలు) 1979

37 మా ఊరు మాట్లాడింది (వ్యాస సంపుటి) 1980

38. సోవియట్ రష్యాలో పదిరోజులు (యాత్రా చరిత్ర) 1980

39 విశ్వంభర (వచనకవితలో సమగ్ర కావ్యం) 1980

40 సమీక్షణం (వ్యాస సంకలనం) 1981

41 అమరవీరుడు భగత్‌సింగ్ (బుర్రకథ) 1982

42 రెక్కలు (కవితా సంపుటి) 1982

43. నడక నాతల్లి (కవితా సంపుటి) 1983

44. కాలం అంచుమీద....(కవితా సంపుటి) 1985

45. తెలుగు గజళ్లు 1986